Reg. No. M. 2580.　　　శ్రీయుత

సంవత్సర చందా రు ౪ లు.




నెల్లూరు జిల్లా జమీందారీ రైతు సంఘ పక్షమున ప్రకటింపబడు వారపత్రిక

సంపుటము ౧. | శనివారము ౭—౧౧—౧౯౩౧ | నెల్లూరు | సంచిక ౩౨

# స్వదేశి సంస్థానముల నీతిశూన్యత!

## శిశుహత్యలు-భార్యలనమ్ముట-అన్యభార్యాపహారణములు

“ నీతిబాహ్యులపాలనము క్రింద ప్రజలు ధర్మమును పాలింపరు ”

ఒక ఆంగ్లయువతి తీవ్రనిరసనము

మాటర్ సాండర్‌సన్ సతి జార్జిసార్వభౌముని సాధ్యముగాని సంస్థానాధీశుల భోగములవర్ణించి, వారినిరంకుశతకు ప్రజల బానిసత్వమును, క్షుద్బాధను హృదయవిదారితముగా వర్ణించుచున్నది. పైరుల పాడుజేయు మృగములచంపరాదు స్వంతకర్చుల బెట్టుకొని రైతులు అంతఃపురములో గొడ్డుచాకిరి, ఎట్టిచాకిరిచేయవలసియున్నది.

సాండర్‌సన్ సతి చాల కాలము ఒక భారత దేశ సంస్థానాధీశుని జనానాయందుండి అందు నెరపబడుచున్న హైన్యముల, ఘోరముల ఇట్లు “ పీపిల్ ” పత్రికయందు వర్ణించుచున్నది :—

“ లండనులో నాకు నాభర్తకు పరిచయిన దిగాము, బిడ్డల పోషణార్థమై హిందూ దేశమున ఒక స్వదేశ సంస్థానాధీశునికి సహచారిణిగా పనిలో ప్రవేశించితిని.

తెలుచుకొన్న కంష్టతో, విషయముల గ్రహించవలయునను ఉద్దేశముతో కొన్నేండ్లు హిందూదేశమునందుండుట నాఅదృష్టము, కాని నా ఉద్దేశముల విని రాజకీయ ప్రతినిధులు మొదలగు మిత్రులు వలదని నిరోధించిరి.

వైభవోపేతమైన ఆవాసములు.

విచారించి నను పోవనున్న సంస్థానము “ చెడ్డ జాబితా ” లో లేదని తెలిసికొని అచటకు పోవుటను గూర్చి తృప్తిపడితిని.

రాణి వితంతువు, యౌవనములో నున్న సౌందర్యవతి. చాలా విషయములలో ఆమె హృదయ రంజకముగానుండినది. ఇతర సంస్థానాధిపతుల భార్యలవలెనే నగలతో మెరసిపోవుచున్నది. ఆమె ఆవాస మందిరము సహజా... విషయములు మిశ్రమైయున్నది.

భావనరణికి అందగలిగిన రమ్యవస్త్రములచే గదులు నిండి పోయినవి: అమూల్యా

భరణములు, ఆడంబరమైన రత్నకంబళ్లు, అద్భుతమైన సామానులు ఉండినవి కాని అందు బ్రిటీషువారి పింగాణీ పాత్రలలో పనికిమాలిన రకము కలసి సౌందర్య వైకల్యమును సంకరతను గూర్చినవి. దర్బారు సభ (హాలు) యందు సుగంధ తైల సామగ్రితో నిండిన అద్దపు అలమారా గలదు. గతించిన రాజుగారి దుస్తులు మొదలగునవి భయాగారముల గూర్చియున్నవి.

### సార్వభౌమునికి అలవిగాని సౌఖ్యములు.

స్వల్ప సంస్థానాధీశులకుగూడ జార్జి సార్వభౌమునకు వరుసబడికంటె జాస్తి ఆదాయముగలదు. ఈ ధనముతో సాధ్యములుగావని మనమనకు తోపింపజేయు విధమున సౌఖ్యానందములననుభవించుచు దురాచారాలకుధనమును వెదజల్లుచున్నారు. మా ప్రక్క రాజాఒకనికి 80 మోటార్లు గలవు. అందు ప్రపంచములో అధిక విలువయైన రోల్సు రాయ్సు కారులు చాలాగలవు. స్వారీ గుర్రములు 40 గలవు వీటిలో యింగ్లీషుజాతి, అరబ్బులు, వేల్సుజాతి, యింకా ప్రశస్తమైన దేశీయ రకములుగలవు అతనికి 100 మంది అంగరక్షకులు, ఇంకా అమూల్య వస్త్రమండితములగు 20 ఏనుగులు కొన్ని ఒంటెలు పరివారముగుచు రాజరిక వైభవమును గూర్చుచున్నవి. అతని ఖడ్గములు రత్నఖచితములు కయ్యబంగారుది. చూచిన తలతిరుగునట్టి ప్రశస్తనవరత్న మయాభరణములతో అతని భార్యలు అలంకరింపబడియుండిరి.

### పాలితుల దుర్భరదుఃఖము

పాలకుడు ఇంతటిభోగోన్మాదుడయ్యె పాలితులు దుర్భరదుఃఖ దుస్థితిమగ్నులై జీవించుచున్నారు. కూలిలేని వెట్టిచాకిరి బలవంతముగా చేయించుకొను ఆచారము ప్రతిసంస్థానమునందును గలదు. ప్రతి స్త్రీ పురుషుడు సంవత్సరమున రెండు నెలలు జీతము భత్యము లేని బానిస చాకిరి నగరికి చేయవలయును. కాని ఈ రెండు నెలలు నియమములు లేకుండా పెరిగిపోయ్యేది కలదు. మరియొక ప్రక్క సంస్థానములో ఒకదినము ఒక అభాగ్యుడు వాకాళ్ల దగ్గర సాష్టాంగముగబడి సహాయమును అతిదీనముగ వేడుకొన్నాడు దేవుడే తన రక్షకుడనియు, బలవంతపు చాకిరి ఎనిమిది నెలలు చేసిబడలి అకటమాడుచున్నానని గుండెనీరగునట్లు యేడ్చినాడు.

### రాజుకు దినదినము డబ్బు ఇచ్చి నౌకరి చేయుట

రాజాంతఃపురములోని సేవకుల ప్రతినెల మార్చెదరు. ఆనెలకు తనకగు భోజనఖర్చు నగదు రాజాకు యీ సేవకులిచ్చి జీతములేకయే బానిసగా నుండవలెను. వారిగ్రామములవారు సరిచేసికొనుటయే గాక సంపాదన పనులన్నిటిని వీరేచేయవలెను.

రాజు వేటకుపోతే గ్రామస్థులు పరవడోలను రావలెను. 2000 మంది పరవడోలుటను నేను చూచియున్నాను. కాని వీరికి రాజు కణికె దమ్మిడైనను ఒసగలేదు.

సదా దుర్భరమయిన హెచ్చుపన్నులు విధింపబడుచున్నవి. ఇవిగాక రాజబంధువుల పెండ్లిండ్లకో-యూరపు యాత్రలందలి వైభవోన్నతికో-ఇతర పర్వదినోత్సవాలకో మరల రయితులనుండి ధనము పీల్చబడి దీనప్రజలు శల్యమాత్రావశిష్టులుగ చేయబడుచున్నారు.

### పైరుల నాశనము చేయు జంతువుల సంహారము.

ప్రతి సంస్థానము నందును ఏగ్రామ రయితుగాని తన పంటచేలను నాశనము చేయు పందులు మొదలగు అడవిజంతువుల చంపరాదు. రాజాకు తెలుపవలెను (యీ దురంతము వెంకటగిరిలో విశ్వరూపమును దాల్చియున్నది) కాని యీ దరిద్ర కృషికులు ఏదిచేయుటకు గాని శక్తి లేదు. నెమళ్లు ఎక్కడు పాసికాపులు సదా వుండే కోతుల పారద్రోల వలసినదేగాని యీ నిర్మూలన కార్యుల ఒకడానిసైనను అంటరాదు. రాత్రిపూట పైరులనున్న వినాశనము చేయును; వీటి ప్రతిక్రియే లేదు.

భారత సంస్థానాధీశులు చంకఖానను లగు నిరంకుశులు. తమ ప్రజలపై వీరిట్టి అధికారమున్నదో వూహించుటకు ఆంగ్లేయులమగుమనకు కేవలము అసాధ్యము ఒకరాజా నలుగురు రాణులకు భర్త అయియుండియు లెక్కకుమించిన వుంపుడుకత్తెలను కలిగియుండవచ్చును.

### వితంతు భార్యల అమ్మకము

ఒక రాజుకు ఇట్టి భార్యలు 300 మంది యుండిరి. అతని మరణానంతరము అతని కొమారుడు యీవితంతు తల్లులను మార్కెటులో పసులవలె యేలంలో అమ్మివేసినాడు. ఆపిల్లరాజే "వేడివేడి రొట్టెల మాదిరి అమ్ముడు పోయినారు" అని నుడివినాడు. ఇంకా సంస్థాన ఉద్యోగులు ఒకరిపై నొకరు పాటల వేసుకొని రాజభక్తి కేమయును, క్రొత్త రాజా తల్లులను కొనిరి.

### క్షుద్బాధా పీడితులగు రాణులు.

మరియొక రాజు తండ్రి మరణానంతరము గద్దె ఎక్కగానే తండ్రి భార్యలను ఒక గ్రామమునకు నివాసముంచి దినదినము యక్కడనుండి భోజనాదుల పంపేవాడు. భోజనాదుల క్రమేణా క్షీణించి ఆకలి దీరని విధమగుటచే వారికి "ఆకలి రాణులు" అని పేరుబడినది.

చిన్న చిన్న బాలికలను ఆరు ఏండ్ల లోపల రాజుకుగా కొనితెచ్చెదరు. అది మొదలు వారికి సంగీతము నృత్యము మొదలగు లలిత కళల నేర్పి వయస్సు రాగానే అంతఃపురమునకు పంపబడుదురు.

### ఉద్యోగుల భార్యల హరించుట.

ఒక పంజాబు సంస్థానములో ఒక సిక్కు ఉద్యోగికి ఒక అందమైన భార్య ఇద్దరు బిడ్డల తల్లి ఉండినది. మహారాజు ఈమె సౌందర్యమునకు నోటనీళ్లూరి దొంగతనముగా ఆమెను హరించి జనానాలోనికి తెప్పించుకొన్నాడు. ఈమె భర్త నిస్పృహతో ఆత్మహత్య చేసికొన్నాడు. తరువాత ఆమెకైనను వదల లేదు.

### అందగాళ్ళను పోషించు సంస్థానములు.

నాకు మరియొక అంతఃపురము సంగతి తెలియును. అందమయిన తరుణ వయస్కులను సేవకులుగా చేర్చుకొనుటను కళగా పోషించి అందు శ్రద్ధను బడసినది. దాసీ జనములో ఒక యువతి గర్భము ధరించగానే ఆమెను యీసేవకులలో ఒకనికిచ్చి పెండ్లిచేసి, యీమెను సేవకుగా కొంత ధనమొసంగ బడుచున్నది.

### తెల్ల తోలు గోరె సంస్థానము.

మరియొక సంస్థానము తెల్లజాతి స్త్రీలు, సహచారిణులుగా, అంతఃపుర సహాయకులుగా కావలెనని ప్రకటనల గావించుటలో సాంద్ర కళంకము సంపాదించుకొన్నది "దరఖాస్తుతో కూడ ఫోటోలు పంపవలెను" అని అడ్వర్ టైజు మెంటులలో వుండును.

నా స్నేహితురాలొకతె తమాషాకు దరఖాస్తుతో ఒక సుప్రసిద్ధమైన హాలీవుడ్ సినిమా నటకురాలి ఫోటోను పంపినది. వెంటనే ఇట్లు టెలిగ్రాం వచ్చినది "400 రూపాయల జీతంపై నిన్ను నియమించినాము, తక్షణం పనిలో వచ్చిచేరు". కానీ యీమె అచటకు పోలేదు.

### నీతి బాహ్యులపాలనము ధర్మమును పాలింపజాలదు.

ఇట్టి సంస్థానములు నడచుచుండ ఎవరేమి చేయగలరు? క్రమ క్రమముగ నీతి క్షీణించి ధర్మశూన్యులగు వారి పాలనము క్రిందనున్న ప్రజలనగమ్యము చేరి ధర్మము నెరవేర్చుకోజాలరు. ఇట్టి స్థితి లోకల్లోలము లుద్భవించినవనినచో వింత లేదు. ప్రజకు రాజుకు సంబంధము లేదు. స్తోత్రపాఠకులే రాచరికముల నెరపుచున్నారు.

### రాజకోశాల ఖాళీ చేయబడుచున్నారు.

జన్మాది రాజకుమారులు ముఖ్యముగా రాజకాబోయ్యేవారు చాలరముగ చెడిపివేయబడుచున్నారు. ప్రతివారు ముకుళిత హస్తములతో నీవు పోవుచుండ వంగి ప్రెముక్కులిడివలయును లేక లేని సుప్రయోజకులగు సేవకులే యీ చెడుపుకు ముఖ్యకారకులు, ఒక బాలుడు తన సేవకుని తన్నుచుండగా వాడు పాదముల బట్టుకొన్నాడు. అప్పుడు మరీ సులభముగా వానిని ఆ అహంకారి తన్నుటను నేను చూచియున్నాను. మరియొకచోట ఒక రాజకుమారుడు బంగారు శయ్యపై పరుండి, వెండిగిన్నెలలో భోజనముచేసి హానికర మగునట్లు అతి గారాబముతో పెంచబడినాడు.

### స్త్రీలను భార్యలుగా అమ్ముట.

ఇక బాలికల కథవేరు. రాజకుటుంబీకుల సంగతటుంచనిచ్చి ఇతర బాలికలు సంతలలో అమ్మబడుచున్నారు. ఈ సంతలు ముఖ్యముగా సింధూనదు పైనున్న సిపియందు జరుగును. బాలికలు వయస్సు ప్రకారము వరుసబాంగు చట్టాలలో నిలిపెదరు. వారిని బాగా అలంకరింతురు. వయస్సునుబట్టి రూపమునుబట్టి బాలికలు రు 100-400 ల వరకు అమ్మబడు పోదురు.

ఇదిగాక దేవాలయముల వారు కూడ బాలికలనుకొని జీవిత పర్యంతము దాసీలుగా పనిచేయించు కొందురు. మంచి జీవితముల గడుపుదను ఆశతో కొందరు తండ్రులు తమ కూతుళ్ల బ్రాహ్మణులకు భార్యలుగా అమ్ముదురు.

### దారుణ శిశుహత్యలు.

పంజాబులో జాట్ జాతిలో శిశుహత్యలు చాల విస్తారముగా నున్నవి. ఆ సంస్థానములో నంతగా ఎక్కువను కొన్న కుక్క పిల్లలను నీళ్లలోముంచి చంపేపని నాపాతకమునకు జట్టుకొన్నది. ఒక నాడు రాణి ఒక తెను నాకుజూపి "అది శిశుల చంపేదానిలో ప్రఖ్యాతి బడసినది" అని చెప్పినది. వీలు చూచుకొని యీ హంతకురాలిని కలిసికొని "నీవు బిడ్డలెట్లు చంపుదువని" అడిగితిని "వాళ్లే గొంతులుచాలా సున్నితములు, ఇదిగాక కొన్నిదినాలు బిడ్డలకు నీరు త్రాగనివ్వకుండినా, దిన దినము అన్నములో నల్లమందు కలిపి నాబిడ్డలు చనిపోవుదురు" అని నిర్లజ్జతో పలికినది.

### రక్త సిక్త ధనము.

పంజాబులో ఒకరాజ వంశమునకు ఆరు పురుషాంతములకుగా ఒక్క ఆడశిశువు మాత్రమే కలిగినది! బీహారునందు కన్య బిడ్డను కన్నచో మంత్రసానికి కొంతడబ్బునిచ్చి శిశువును తుద ముట్టించమనెదరు. మంత్రసాని బిడ్డను ఒకతట్టలో బెట్టి నక్కలకు ఆహారమగునట్లుగా అడవిలో విడిచివచ్చును. స్వదేశి సంస్థానములలో చావు అతిసులభముగా పసిగెత్తి వచ్చును. ఒక బాలిక ఆశాస్త్రీయ ప్రేమకథలో చిక్కినచో ఆమెనుకొట్టి, రైలు ప్రయాణమునకు తీసికొని పోవుదురు. పాయ్యే రైలు నుండి ఆ బాలిక నవ్వముగా "క్రిందకు జారిపడును." ఒక్కొక్కప్పుడు ఇంటి దంపి రైలుకమ్ములపై పడవేయుదురు. గోపానుగూర్చి అనవసర ప్రాముఖ్య మొసగబడుచున్నది. ఇట్టి ఘోరము లనేకములు గలవు.

---

### నెల్లూరు జిల్లాలో ఉప్పు కేసులు.

గాంధి, ఇర్విన్ ఒడంబడికకు భిన్నముగా నెల్లూరు జిల్లాలో గూడూరు, సూళ్ళూరుపేట ప్రాంతములలో వుప్పు యేరుకొనరాదని సాల్టు కమీషనరు ఉత్తర్వు చేసిరి. దీనిపైన వుప్పు ఏరుకొన్న వారిపై చాల కేసులు పెట్టినారు. ఇప్పుడు 100 మంది పంచములకు జుర్మానా విధింపబడినది. దీనిని ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ కార్యదర్శి బెజవాడ గోపాల రెడ్డిగారు కాంగ్రెసు అధ్యక్షుడు పటేలుగారికి తంతిమూలమున తెలిపిరి.

---

## వెంకటగిరి సభల నిషేధములు వంటివి ఇకముందు జరుగవు.

---

### మదరాసు శాసనసభలో నటేశ మొదలియార్, వెంకటాచలం శెట్టి అబ్దుల్ హమీదాఖానుగార్ల ప్రశ్నలు.

---

ప్రభుత్వ సభ్యుడు త్రేసీ కాగారు తప్పును ఒప్పుకొనుట.

---

8 తేదీ శాసనసభా సమావేశమున ఇట్లు ప్రశ్నించిరి.

### రా॥ బ॥ సి. నటేశ మొదలియారు గారి ప్రశ్న.

(ఎ) వెంకటగిరిలో జమీందారీ రయితుల సభను నిషేధించుచు ఉత్తరువులను జారీచేసిన గూడూరు సబుకలెక్టరు మేజస్ట్రేటులనుండి సమాధానమును ప్రభుత్వమువారు గైకొనినారా (బి) అందుకు సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరములను సభ యెదుట బెట్టెదరా?

జవాబు:—(1) లేదు. (2) లేదు.

### అబ్దుల్ హమీదుఖానుగారి ప్రశ్న.

(ఎ) నెల్లూరు జిల్లా వెంకటగిరిలో గత సెప్టెంబరు 8, 9, తేదులందు జరుపబడిన జమీందారీ రైతుల సభయొక్క కార్యదర్శులపై నిషేధపు ఉత్తరువులు జారీచేయబడుట నిజమేనా?

(బి) ఆయుత్తరువుయొక్క నకలును, అందుకు జవాబుగా దాఖలు చేయబడిన పిటీషను యొక్క నకలును, సభయెదుట పెట్టెదరా?

(సి) ఆసభయొక్క ఆహ్వాన సంఘాధ్యక్షుడగు పెనుమూరు నాయుడు (భారత శాసనసభ యొక్క పూర్వపు సభ్యుడు) గారును, చెన్నపురి శాసనసభయొక్క పూర్వపు సభ్యుడగు విశ్వనాథ రాజుగారును ఆ నిషేధపు ఉత్తరువుల సందర్భమున గూడూరు సబ్ కలెక్టరు మేజస్ట్రేటును సందర్శించుట నిజమేనా?

(డి) ఈ సభకు ప్రతినిధులును, ప్రేక్షకులు ను దక్కట్లమూలమున చెయ్యబోబడుట నిజమేనా?

(ఇ) ప్రజాశాంతి భంగమగునని పోలీసువారును, సబ్ కలెక్టరుగారును భయపడుటకు గల కారణమును, ప్రభుత్వమువారు కనుగొంటిరా?

జవాబు:—(ఏ) గత సెప్టెంబరు 8, 7 తేదులందు జరుగబడుటకు ఏర్పాటుచేయబడిన జమీందారీరయితుల సభయొక్క ఆహ్వానసంఘ కార్యదర్శులుగా ప్రకటింపబడిన కె. కల్యాణరావు, కె. వెంకటరావుగార్లపై నెం 144 సెక్షను ఉత్తరువు జారీచేయబడెను.

(బి) గూడూరు జాయింటు మేజస్ట్రేటు యుత్తరువు యొక్కయు, అందుకు జవాబుగా దాఖలుచేయబడిన పిటీషను యొక్కయు, నకల్లు సభయెదుట ఉంచబడినవి.

(సి) అవును.

(డి) సభకు ప్రతినిధులను, ప్రేక్షకులను, దక్కట్లమూలమున చెయ్యబోవుటకు యేర్పాటు చేయబడినట్లుగా తెలిసెను.

(ఇ) ప్రజాశాంతి భంగమగునని భయము నకుగల కారణములు గూడూరు జాయింటు మేజస్ట్రేటుయొక్క యుత్తరువునందు వివరింపబడి యున్నవి

### సామి వెంకటాచలం శెట్టిగారు

దీనిపై అనుబంధ ప్రశ్న నిట్లు అడిగిరి:—ఇతరులు కొందరు ఆక్షేపించదగిన ఉపన్యాసములు చేయబడునను భావముతో అట్టిసభల నిరోధించుట ప్రభుత్వ విధానమా?

### ఇకమీదట ఇట్టివి జరుగవు.

గౌ. ఉస్మాన్ గారిట్లు బదులు చెప్పిరి అట్టి సభల సమావేశ పరచుట' చిరమతమగునదని నిషేధపు ఉత్తర్వులు వచ్చుట అని విలా అందరికప్పటికి నాకు తెలియును. ప్రస్తుత సందర్భమును బాగుగ పరిశీలించితిమి, ఇరుపక్షముల వారి వాదములు సమంజసముగనే యున్నవి. గాని యిట్టివిమరల యెప్పుడుగాని జరుగవని మాత్రము గౌరవనీయ సభ్యులతో గట్టిగ చెప్పగలను.

ఇకమీద జరుగవు"

### ఆంధ్ర పత్రిక సంపాదకీయమున ఇట్లు వ్రాయుచున్నది:—

వెంకటగిరి నిషేధపు ఉత్తరువుల గూర్చి మదరాసు శాసనసభలో వచ్చిన ప్రశ్నలకు హోం మెంబరుగారు చెప్పిన జవాబులా విన, అట్టి యుత్తరువుల కట్టి యవసరము గలుగలేదని స్పష్టమగుచున్నది. ఎవరో అల్లరి చేసెదరను తలంపుతో, జనుల సభలను నిరోధించుట, శాంతి రక్షణమార్గము గాజాలదు. దుండగీండ్రను నిరోధించి, సక్రమ సభలను జరుగనిచ్చుటయే, అధికారుల ధర్మమగును. ఈ విషయము మరియొకటి, ఇట్టి ఉత్తరువు లికమీద జరుగబోవని, హోం మెంబరుగారు ప్రభుత్వపక్షమున వాగ్దానము చేయుట, సముచితముగ నున్నది. వీరు వాగ్దానము నెరవేర్చుచో, అధికారులు సరిహద్దులను దాటపోవ మెలగుట సులభసాధ్య మగును.

---

## రంగనాయకుల ఆర్థిక విచారణ సంఘము

### సంచార కార్యక్రమము

8-11-1931: పెదపవని, గుర్జాల, కొండూరు.
9-11-1931: చండి, లింగసముద్రం, ఖోట్ల గూడూరు.
10-11-1931: పామూరు, రావిగుంటపల్లెపాలెము.
11-11-1931: పెదారికట్ల, పోదిలి
12-11-1931: ఉప్పలపాడు.
13-11-1931: దర్శి.
14-11-1931: కురిచేడు.
15-11-1931: దొనకొండ, తర్లుపాడు.
16-11-1931: పొతకమూరు.
17-11-1931: తాళ్లూరు.

పై కార్యక్రమము ప్రకారం, ఆ కేంద్రములలో బహిరంగ విచారణ జరుపుదురు. జమీందారీ రయితు లెల్లరు విశ్వాసిం చి తమ కష్టసుఖములను గూర్చి సాక్ష్యమొసగ వలసినదిగా కోరుచున్నాము.

నెల్లూరు వెంకటాద్రిమా నాయుడు,
కార్యదర్శి,
నెల్లూరు జి. జ. రై. సంఘము

---

## చల్లపల్లి జమీందారీ రయితులు

### ఆచార్య రంగనాయకులు గారి ప్రచారము

క్రిందటినెల తే 19 నుండి తే 29 వరకును రయితు నాయకులగు ప్రొఫెసరు రంగనాయకులు గారితో బ్రహ్మయ్యచౌదరి, వాసిరెడ్డి బ్రహ్మయ్య బలరామకృష్ణయ్య గారలు చల్లపల్లి యెస్టేటులోని భట్ల పెనుమర్రు, కాజ, ఘంటసాల, యార్లగడ్డ, చిన కళ్లేపల్లి, శ్రీకాకుళం, లింగాలం గ్రామములందు, రయితుసభలు చేయుంచి రయితు సంఘముల స్థాపించిరి. ఈసభల కన్నిటికి, అపరిమిత ప్రాంత్యముల రయితులు హాజరైరి. దానాత్ర, తము పైని రయితు సంఘముల స్థాపించుట కేర్పాటులు చేయబడినవి. శ్రీయుత రంగనాయకులుగారు జమీందారీ రైతులను పోలినదానితో, జమీందారీ రయితు లెందులకై తమ ప్రత్యేకాందోళనము చేసి, జమీందారీ పద్ధతిని నిర్మూలించవలయునో, రయితులకు తెలియజెప్పి శ్రీబలరామకృష్ణయ్య గారు జాతీయోద్యమము గూర్చియు, శ్రీనా బ్రహ్మయ్యగారు రివిజన్ సెటిల్మెంటు వలన అధికపు పన్నులను రయితులపై వేయుట అధికారు లనుసరించిరి. త్వరలో జరుగనున్న కృష్ణాజిల్లా జమీందారీ రయితు సభకే యీ సభ లుపయోగకరమని చెప్పవచ్చు. ఒకవిలేఖరి.

---

# వార్తావాహిని

రంగనాయకులుగారి రాక.

వెంకటగిరి డివిజను లోని, పెరిమిడి, మోపూరు, గ్రామరైతుల పశువులను, జమీందారు మేతకు పోకుండా నిర్బంధించిన సందర్భమున టెలిగ్రాం యివ్వగా రంగనాయకులుగారు 4 తేది ఉదయం వెంకటగిరి వచ్చిరి. రయితులకు అవసర సలహాలనిచ్చి 5 తేది తెనాలిలో జరుగు గ్రామ పంచాయతీల సభకు వెళ్ళిరి. తిరుగా 6 తేది ఉదయం వెంకటగిరి వచ్చి కలుగోడు గ్రామములో జరుగు రయితుల సభకు వచ్చి వారికి అవసరమగు సలహాలనిచ్చి 7 తేదీన నెల్లూరు జిల్లా కలెక్టరుగారితో జమీందారీ రయితుల కంచెల బాగాలు మొదలగు విషయముల గూర్చియున్ని జిల్లా సూపరింటెండెంటుగారితో 1-11-31 తేదిన పెరిమిడి గ్రామముకు వెంకటగిరి సర్కిల్ ఇన్ స్పెక్టరు వచ్చి రయితుల పశువులు మందలములు మొదలగు సముదాయక భూములలోగూడా జమీందారుగారి ప్రత్యేక లిఖిత మూలకమైన ఉత్తర్వు లేనిదే పోనివ్వకూడదని రయితుల బెదిరించి జమీందారుకు సపోర్టు చేసిన విషయముల గూర్చి మాట్లాడి 8 తేదినుండి ఈ జిల్లాలో ఉత్తర ప్రాంతములో ఆర్థిక విచారణ సాగింతురు,

8 సంవత్సరముల నాటి ధరలప్పుడు ఇప్పుడు వసూలుతుల.

మా వెంకటగిరి సంస్థానములో, కొన్ని రొఖ శిస్తుల గ్రామాలున్నా, కొన్ని ధాన్యపు శిస్తు గ్రామాలున్నా వున్నవి, ధాన్యపు శిస్తు గ్రామాలలో రెండు మాదిరులు, ఒకటి రొఖ ధరముల రేట్లమాదిరి ధాన్యపు ధరముల నిర్ణయించినవి. మరొకటి పండిన ధాన్యములో జమీందారు, రైతు, చెరిసగము పంచుకొనునది. మొదటిమాదిరి పండినను, ఎండినను ధరముల ప్రకారం ధాన్యముగాని, ధాన్యపు క్రయము ప్రకారం రొక్కముగాని వసూలు చేతురు. రెండవమాదిరి పండిన పంటను అంచన వేసి, కోయించి, నురిపించి చెరిసగము ధాన్యము వసూలు చేతురు, ఈ రెండవ పద్ధతిలో నౌకరులు కుంభకోణము చేతురు.

సూళూరుపేట యిలాకా ఒక గ్రామములో మూడు సంవత్సరములనాడు కోయించి కుప్ప వేయించిన దానిని మా అధికారులకు యింతకాలము తీరక (రయితులపై అనవసర వ్యవహారములు జరుపుచుంకుటచే కాబోలు ?) మొన్న నురిపించి ధాన్యం పంచుకొన్నారట !

దీనివల్ల రయితుకెంత లాభమో గమనించండి. ఈలాటి దొరతే శాశ్వతంగా పాలించాలనే మా సోదరులేమంటారు ?

"లోక సంచారి"

## ఎస్టేటు ల్యాండు ఆక్టు సవరణ బిల్లు

మదరాసు శాసన సభలో శే౹ది ఎస్టేటు ల్యాండు బిల్లునుగూర్చి చర్చింపబడెను. ప్రభుత్వమువారికి చట్టము నుపసంహరించుకొనుట కిష్టము లేదనియు, అందుతో పాటు ఒక ప్రైవేటు బిల్లును ఉపపాదించిన ప్రభుత్వమువారాలోచింతురనియు ప్రభుత్వ సభ్యులు నుడివిరి

రౌండు టేబిల్ సభ విఫలమైన ?

మహాత్ముడు విద్యాకేంద్రము కేంబ్రిడ్జిలో మజ్లిస్ అను హైందవుల సభలో ప్రపన్యసించుచు, రౌండు టేబిల్ సభలో జరిగిన ప్రాతినిధ్యము జనాభిప్రాయానుగుణ్యముగ లేదు. సభ విఫలమగుచో మరల శాసనోల్లంఘనము ప్రారంభింపబడును కానీ బాగుగ యోచించి కాంగ్రెసు ఆదేశానుసారముగ జరుపబడును. నియమబద్ధ శక్తికి లోబడినదగుటచే యీ ఉద్యమము నెట్లయిన ప్రయోగించవచ్చును అని నుడివిరి ప్రభుత్వ దృక్పథము మారలేదని ప్రధాని వైస్ రాయి గారికి తంతివంపిరి. కాంగ్రెసు ప్రభుత్వ ఒక చిత్తు ప్రణాళికను వెలువరించిరి.

ఇతర దేశములలో పెండ్లి వయస్సు.

మన దేశములో కడుపులో బిడ్డను గూడా పెండ్లిచేసేవారు. హర్ బిలాస శారదాగారి పుణ్యాన బాలిక వివాహపు వయస్సు 14 సం॥లని శాసింపబడినది. ఇతర దేశములలో శాసనాల ప్రకారము ఇట్లున్నవి. ఫ్రాంసులో బాలునికి 18 సంవత్సరాలు, బాలికకు 16 ఏండ్లు వుండవలెను. జర్మనీలో వరునికి అధమము 18 వుండవలె. పోర్చుగల్, గ్రీసు, స్పెయిను దేశములలో బాలునికి 14 ఏండ్లు బాలికకు 12 ఉండవలెను. ఆస్ట్రియాలో పెండ్లికొడుకుకు పెండ్లికూతురుకి యిద్దరికి 14 ఏండ్లుండవలెను. ఇక టర్కీలో నడవగలిగి మంత్రాల ఉచ్చరింపగలిగిన బాలికా బాలురు వివాహ బంధములో తగులుకోవచ్చును. పెర్షియాలో యీమధ్యనే బాల్య వివాహాల నిషేధించే శాసనము చేయబడినది.

పోస్టు కార్డు కనిపెట్టినదెవరు ?

ఈగౌరవము ఇద్దరికి చెందవలయును. యూనివర్సల్ పోస్టల్ యూనియన్ స్థాపకుడు హీన్రిచ్ వాన్ స్టీఫన్ గారు 1865 లో జర్మనీపోస్టాఫీసుకు కార్డు పద్ధతి సూచించినాడు మరల 1867 లో ఒక సభలో తెలుప సూచన నిరాకరింపబడినది. దీనిని ఎరుగకయే 1869 లో డాక్టరు హెర్మ్యాన్ అను ఆస్ట్రియన్ వియన్నా పత్రికలలో కార్డును వర్ణించి తక్కువ రేటుకు అమలులో పెట్టవలయునని సూచించిరి. దీని ఆస్ట్రియా పోస్టువారు గ్రహించి వెంటనే ప్రవేశ పెట్టిరి. భారతదేశములో కార్డు 1870 అక్టోబరు మొదటి తేది ప్రవేశపెట్టబడినది.

## నవ్వు పువ్వులు

డాక్టరు - పరీక్షించి - నీకిబ్బందిగా, సిగరెట్లు, బీడీలు, సారాయి, మాంసాదులు తినరాదు, అంటే''

రోగి బయలుదేరి పోబోగా డాక్టరు "ఫీజు నాకీలేదండి?"

"ఎందుకు? మీ సలహా ప్రకారం నేను నడచుకోబోయ్యేది లేదు"

◆ ◆ ◆

పిల్లవాడు:- నాయనా, విశ్రాంతి అంటే ఏమిటి!

తండ్రి:- భార్య ఏదో పనిచేసి కొంటూ లోకలుంటే భర్తబయట దిగులులేకుండా కూర్చున్న రెండు నిమిషాలే

◆ ◆ ◆

కనిదొరకని బి.ఏ. భార్యతో "ఏమే! రాత్రి నాకు కనిదొరికినట్లు కలవచ్చింది"

"అవును, అందుకే అలసియున్నారు"

◆ ◆ ◆

మీ పిల్లలందరూ సంగీతపాటకులైనా నీకు సంగీతంపై అభిరుచి ఎందుకు లేదయ్యా "మీవారి సంగీతంవింటే మీకూ అట్లనే వుంటుంది"

◆ ◆ ◆

యజమాని:- చూడు! ఆమూలబల్లల మీద ఆరునెలల దుమ్మున్నది.

కొత్తనేకరుడు:- దానికి నే నేమి చేసేకండి, నేనువచ్చి మూడు నెలలేగదా అయింది.

* * *

దారిమధ్య మోటారుచెడింది. డ్రైవరు క్రిందదూరి ఎల్లక్రిందలా పండుకొని ఏదోరిపేరు చేసుకొంటుండినాడు. ఇంతలో రోడ్డుప్రక్కన వుండే గ్రామంనుండి యిద్దరు వచ్చిచూచినారు.

ఒకడు:- ఏమిటట్లా చూస్తున్నాడు పండుకొని''

మరియొకడు "వెర్రిముగం! మోటార్లు ఎపుడూ చూడలేదు గామాల"

◆ ◆ ◆



సంపాదకుడు, ప్రకాశకుడు :— కిల్లాడ వెంకటాద్రి నాయుడు, [illegible] ముద్రితము, [illegible]